

# నీ బతుకు సఫలం చేసుకో!

# నిజ దైవమెవరో? తెలుసుకో!

రచన - సయ్యిద్ అబ్దుస్సలాం ఉమరీ

# నీ బతుకు సఫలం చేసుకో! నిజ దైవమెవరో? తెలుసుకో!

సయ్యిద్ అబ్దుస్సలాం ఉమరీ

## ముఖ్య గమనిక:



29/ 05 / 2021




Prabodhanam printing press

అనంత కరుణామయుడు అపార దయానిధి అయిన అల్లాహ్ పేరుతో

# ముందు మాట

మానవుడు వైజ్ఞానికంగా గొప్ప అభివృద్ధిని సాధించాడు. నక్షత్రాల ఆవల లోకానికి నిచ్చెనలు వేస్తు న్నాడు. అపరిచిత, సుపరిచిత ప్రాంతాలను తన కైవసం చేసుకునేందుకు ఉరకలేస్తు న్నాడు. సమాచార ప్రసారానికి అతి వేగమయిన పరికరాలను కనుగొని ప్రపంచాన్ని ఓ గదిగా మార్చగలిగాడు. ఇన్ని విజయాలను సొంతం చేసుకున్న మానవుడు ఇన్ని ప్రగతి ఫలాలను అనుభవిస్తున్న మానవుడు తన ఉనికి గురించి, ఉనికి లక్ష్యం గురించి తెలుసుకోక పోవడం, కనీసం తెలుసు కునేందుకు ప్రయత్నించక పోవడం ఎంతో విచారకరం. కనిపించేదే, వినిపించేదే, పంచేంద్రియాల పరిధిలో వచ్చేదే నిజమని అనుకుంటే ప్రమాదం.

దేవుడంటే ఒక నమ్మకం మాత్రమేనా? ఒక్కో ప్రాంతానికి ఒక్కో దేవుడుంటాడా? దేవుడు అవతరిస్తాడా? దేవుడు సాకా రుడా? నిరాకారుడా? పుడతాడా? మరణిస్తాడా? దేవునికి భార్య, సంతానం ఉందా? మనకులాగే దౌర్బల్యాలు కలవాడా? దేవుడు ఒక్కడా? ముగ్గురా? ముక్కోట్లా? 54 కోట్లా? దానికి మించా? ఈ ప్రశ్నలకు సమాధానం కావాలంటే ఈ చిరు పుస్తకం  చదివి తీరాల్సిందే. దేవుని గురించి ఇప్పుడెందుకులే అంటూ కాలయాపన మాని కర్తవ్య నిర్వర్తనకై సంసిద్ధులవ్వండి.

సయ్యిద్ అబ్దుస్సలాం ఉమరీ



# విషయ సూచిక





## పడ్డాడు తికమక నిజ దైవమెవరో తెలియక

బుద్ధిజ్ఞానాలలో అసమానుడయిన మానవుడు విశ్వంలో ఆవిష్కరించిన కోణాలు ఎన్నో, జీవితంలో అన్వేషించిన క్షేత్రాలు ఎన్నో, కనుగొన్న సిద్ధాంతాలు ఎన్నో, అవలంబించిన ఆచారాలు ఎన్నో, స్థాపించిన సంప్రదాయాలు ఎన్నో, ఎన్నెన్నో!! ఫలితంగా ధరిత్రిని జీవించడానికి అనువయిన మనోహర, మనోజ్ఞ నివాసంగా మార్చు కున్నాడు. కానీ, మనిషి మానసిక తృష్ణ తీరలేదు. ఆత్మ ఆవేదనా జ్వాల ఆర లేదు. అభివృద్ధి సాధించనకొద్దీ అశాంతి, అసంతృప్తి అంతకన్నా వేగంగా ఆంతర్యాన్ని ఆవహించాయి. పక్షుల్లా ఎగరడం నేర్చుకున్నా, చేపల్లా ఈదడం అభ్యసించినా మనుషుల్లా బ్రతకడం రాలేదు. కారణం-తన ఉనికికి మూల విరాట్టు అయిన నిజకర్తను గుర్తించక పోవడమే. గుర్తించినా ఆయన చూపిం చిన బాటన సరిగ్గా నడవక పోవడమే. నిజ దైవం విషయంలో మనిషి వల్ల జరిగిన తత్తరపాటు, తొందరపాటును రెండుగా మనం విభజించవచ్చు. 1) అజ్ఞానం,అపోహ వల్ల ఏర్పడ్డ అభిప్రాయం. 2) వాంఛ వల్ల ఏర్పడ్డ ఆంక్ష.



## నాస్తికుని అజ్ఞానం, అపోహ వల్ల ఏర్పడ్డ అభిప్రాయం

వీరి సమస్య ఏమిటంటే, పాపం వీరికి దేవుడంటే ఏమిటో? ఎవరో? తెలీదు. వారు నివసించే పరిసరాల్లో, వారి అనుభవంలోకి వచ్చిన విషయాల్లో పలువురు పలు రకాలుగా, పలువురిని దైవాలుగా కొలవడం, వాటి కోసం కొట్టుకోవడం, చావడం, చంపుకోవడం చూసి విసుగు చెంది దేవుడే లేడన్న నిర్ణయానికొచ్చేసారు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే ఒకరు తప్పును, తప్పుడు వ్యక్తులను దైవంగా కొలిస్తే దైవం గురించి నిజానిజాలను నిగ్గు తేల్చుకోవడం మాని దైవం పట్ల తప్పుడు అభిప్రాయాలు కలిగి జీవించడం ఎంత వరకు సబబు?

దేవుని పేరిట మోసం, హింసను ప్రోత్సహిస్తూ ఉంటే, మనిషిని మనిషి దోస్తూ ఉంటే, మంచికి సమాధి కడుతూ ఉంటే – అంతా మనిషే చేస్తుంటే "ఉన్నావా? అసలున్నావా?" అని సవాలు చేయడం, తర్వాత **'లేవు, లేనే లేవు'** అని ఓ నిర్ణయానికి వచ్చేయడం 'దేవుడి కేం హాయిగా ఉన్నాడు-ఈ మానవుడే బాధ పడుతున్నాడు' అనడం, 'మనసు లేని దేవుడు మనిషికెందుకో మనసిచ్చాడు' అనడం-అంతా మనిషికే చెల్లింది. చరిత్రలో దేవుడు దుష్టులను శిక్షించిన దాఖలాలు కోకొల్లలుగా ఉన్నా అతని కి కనబడటం లేదా? దేవుని విషయంలో మనిషి పాల్పడిన ఘాతుకాన్ని సంస్కరించడానికే, నిజ దైవ మెవరో తెలియజేయడానికే, మానవ సమాజాల మధ్య చోటు చేసుకున్న కన్ఫ్యూషన్స్‌ని క్లియర్ చెయ్యడానికి, రూల్సు, రెగులేషన్సు విడమరచి చెప్పడానికి 1 లక్ష 24 వేల మంది ప్రవక్తలు ఆయా కాలాల్లో, అయా దేశాల్లో వచ్చారన్న యదార్థం తన వరకూ చేరలేదా?

అలా వచ్చిన పవిత్రాత్మల విషయంలో మళ్ళీ కన్ఫ్యూషన్స్‌కి గురయి వారినే దైవంగా, దైవాంశ సంభూతులుగా, దైవ సంతానంగా నమ్మి నమస్కరిస్తే ఆ తప్పు బుద్ధి గడ్డి తిన్న నరునిది అవుతుందేగానీ, నిజ దైవానిది కాదు కదా! ఇదే విషయాన్ని దేవుడు మానవుడితో అడినప్పుడు ఏం జరుగుతుందో చూడండి!

**"మర్యమ్ కుమారుడవయిన ఓ ఈసా! నిజ దైవాన్ని వదలి నన్నూ, నా తల్లిని ఆరాధ్య దైవాలుగా చేసుకోండి అని గాని నీవు ప్రజలకు చెప్పావా?" అని అడిగే సందర్భాన్ని కూడా స్మరించుకోదగినది. అప్పుడు ఈసా ఇలా విన్నవించుకుంటారు: '(ఓ దేవా!) నేను నిన్ను పరమ పవిత్రునిగా భావిస్తున్నాను. ఏ మాటను అనే హక్కు నాకు లేదో అలాంటి మాట అనడం నాకు ఏమాత్రం తగదు".** (దివ్య ఖుర్ఆన్-5: 116)

"నా ప్రభూ, మీ ప్రభువూ అయిన అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించండి"అన్న ఏ ఆదేశమయితే నువ్వు నాకిచ్చావో అది తప్ప మరో మాటను నేను వారికి చెప్ప లేదు. నేను వారి మధ్య ఉన్నంత కాలం వారిపై సాక్షిగా ఉన్నాను". (117)

"ఒకవేళ నీవు వారిని శిక్షించినట్లయితే వారు నీ దాసులు. నీవు గనక వారిని క్షమించి నట్లయితే నిశ్చయంగా నీవు సర్వాధిక్యుడవు, వివేచనాపరుడవు".

(దివ్య ఖుర్‌ఆన్-5: 118)





## ఆస్తికుని అజ్ఞానం, అపోహ వల్ల ఏర్పడ్డ అపనమ్మకం

అందమయిన ముఖం, పొందికయిన అంగ సౌష్టవం, ఆరోగ్యమయిన శరీరం-మానవుని దేవుడు ప్రసాదించిన మహా వరాలు. తన ప్రమేయం లేకుండా, తనకు తెలియకుండానే లభించిన ఈ ఆకృతిని, అంగాంగాలను చూసుకుని ఆనందిస్తూ, అడక్కుండానే తనకు వీటినిచ్చిన ఆ కర్తను, స్వామిని, తన నిజ ప్రభువును గుర్తించాల్సిన రీతిలో గుర్తించ లేక పోతున్నాడు. ఒకవైపు - నరుడు దేవుడు, వానరుడు దేవుడు, వస్తువు డోనరుడు దేవుడు అంటూ ప్రతి దానికి దైవత్వాన్ని ఆపాదిస్తున్నాడు. మరో వైపు నిజ ఆరాధ్యుని సత్యబద్ధ గుణాలను విడగొట్టి ప్రతి గుణాన్ని ప్రత్యేక దైవంగా (ట్రూత్ ఈజ్ గాడ్) **'సత్యమే దైవం'**, (లవ్ ఈజ్ గాడ్) **'ప్రేమే దైవం'**, (గాడ్ ఈజ్ లైట్) **'కాంతే దైవం'**, 'శాంతే దైవం' (గాడ్ ఈజ్ ఎనర్జీ) **'శక్తే దైవం'** అని చెప్పుకొని అలౌకికానందంతో హారతులు పడుతున్నాడు. 'మదిలో శాంతి లేనప్పుడు ఈ మనిషిని దేవుడు చేశాడు' అంటాడొకడు, **'రాయైతేనేమిరా దేవుడు – హాయిగా ఉంటాడు జీవుడు-ఉన్న చోటే గోపురం ఉసురు లేని కాపురం-అన్నీ ఉన్న మహానుభావుడు'** అంటాడు ఇంకొకడు.

ఇంకో వైపు **'మానవుడు లేకుండానే మానవత్వం'** ఎలా సాధ్యమో చెప్పకుండానే, 'దేవుడు లేడు, దైవత్వం ఉంది' అంటూ అర్థం కాని తత్వాన్ని తలకెక్కించుకునే విఫల ప్రయత్నం చేస్తున్నారు మరికొందరు. మనిషికి మనిషే మిత్రుడట, మనిషికి మనిషే శత్రువట, మనిషికి మనిషే దేవుడట. మనిషికి మనిషే దెయ్యమట. ఇదిలా ఉంటే, **'ఉన్నాడో లేదో తెలీదుగానీ ఉంటే మంచి దేగా'** అని మాట దాట వేసే ప్రబుద్ధులు మరికొందరు. 'జై ఇన్సాన్' అనే వారు కొందరు, 'జై షైతాన్' అనేవారు మరికొందరు. రూప రహితుడు- నిర్గుణ నిరాకారుడు అని అనేవారు కొందరు, రూప రహితుడు- సాగుణ నిరాకారుడు అనేవారు మరికొందరు. **'విభుని ఆలయం భువనం'** అనేవారు కొందరు, **'ప్రభువు నిలయం హృదయం'** అనేవారు కొందరు. 'నువ్వు మనిషివా, పశువా?' అంటేనే అగ్గి మీద గుగ్గిలం అయ్యే ఆధునికుడు **'దేవుడు పశువుగా కూడా అవతరిస్తాడనటం'** ఎంత విడ్డూరమో ఆలోచించాలి!

సామాన్య వ్యక్తిని ఒక జాతి పెద్దతో పోల్చితే జీర్ణించుకోలేని మాన వుడు, సృష్టికర్తను అల్పాతి అల్ప ప్రాణులతో పోల్చే దుస్సాహసం చేయడం మిక్కిలి విచారకరం, వికారమూను. వీరు గ్రహిం చాల్సివ విషయం ఏమిటంటే, 'దేవుడు లేడు' అనడం మాత్రమే తిరస్కారం కాదు; దేవుడున్నాడు అని నమ్ముతూనే ఆయనతోపాటు అనేక ఇతర శక్తుల్ని దైవ సమానమయి నవిగా, పూజ్యనీయమయినవిగా భావించడం, అలా ఆచరించడం కూడా తిరస్కారమే, దేవుని యెడల కలిగి ఉండాల్సిన భావన కలిగి ఉండకపోవడం కూడా తిరస్కారమే.

'జీవి' 'జీవిక' 'పదార్థ ఉత్పత్తి' 'పునరుత్పత్తి మటుకు విశ్వ పాలకుడు నిర్ణయించిన పంథాలోనే సాగ గలదు. మనిషిగానీ, నిజ దైవాన్ని కాదని తాను కొలుస్తున్న ఇలవేల్పులు ఎవరయినా గానీ ఎన్ని చేసినా ఒక్క ప్రాణ సృష్టిని సాధించ లేరు. ఇదే యదార్థాన్ని ఖుర్ఆన్ ఇలా పేర్కొంటుంది:

**"ఓ ప్రజలారా! ఒక ఉపమానం ముందుంచడం జరుగుతోంది, సావధానంగా వినండి! అల్లాహ్‌ను కాదని మీరు మక్కువతో అర్థిస్తున్న ఆరాధ్య శక్తులు అన్నీ కలిసి ఒక్క 'ఈగ'ను సృజించదలచినా అవి సాధించ లేవు. అంతే కాదు, ఈగ లాంటి అల్ప జీవి వాటికి సమర్పించిన నైవేద్యాల నుండి దేన్న యినా తన్నుకుపోయినా అవి దాన్నుండి తిరిగి దక్కించుకోలేవు. అర్థించే వారు (ప్రధాన అర్చకులు) బలహీనులే. అర్థింపబడేవారూ (అర్చనలందుకునే వారూ) బలహీనులే!! వాస్తవమేమిటంటే, వీరు అల్లాహ్ గొప్పదనాన్ని గుర్తించ వలసిన రీతిలో గుర్తించడం లేదు. వాస్తవానికి శక్తిమంతుడు, గౌర వాధిక్యతలు గలవాడు అల్లాహ్".** (దివ్యఖుర్ఆన్-22:73, 74)



## నాస్తికుని వాంఛ వల్ల ఏర్పడ్డ ఆంక్ష:

దేవుడుంటే కనగలగాలి, వినగలగాలి, వాసన చూడగలగాలి, తాక గలగాలి, రుచయినా తెలియాలి అన్న మనిషి గీసుకున్న హేతువు చట్రంలో దైవాన్ని నిరాకరించే ప్రయత్నం చేసిన మానవుడు, దేవుని ఉనికిని చాటే కోటానుకోట్ల నిదర్శనాల గురించి ఆలోచించ లేక పోయాడు. 'ప్రతి సృష్టి' అని చెప్పుకుని ఎంత సంబర పడినా, తన బుద్ధిజ్ఞానాల ఆధారంగా అంబ రాన్ని చుంబించానని ఎన్ని డాంబికాలు పలికినా, గగనతలంలోని గోళాలు, గ్రహాలు, ఉపగ్రహాల రహస్యాలను ఛేదించ గలిగానని ఎన్ని గొప్పలు పోయినా, పాతాళంలోకి పాకిపోవాలని ఎంత పాకులాడినా, మహా సము ద్రాలు మథించాలని ఎంత మథన పడినా, మనిషి తనను ఉనికినిచ్చిన నిజ దైవాన్ని గుర్తించే స్థాయికి ఎదగలేక పోయాడు. సృష్టి శ్రేష్టుడయి కూడా చిన్న చిన్న పనులే సరిగా చేసుకోలేనపుడు ఇంత పెద్ద భూమి, ఏ స్థంభం కాన రాని సువిశాలాకాశం, అలాంటి ఏడు భూములు, ఏడు ఆకాశాల వ్యవస్థ దానంతట అదే పని చేసుకుంటుంది అని ఎలా నమ్ముతున్నాడు?



మానవ జీవితం బహు విచిత్రమయినది. పుట్టుకే ఓ వింత అనుకుంటే బ్రతకంతా చిత్ర విచిత్రాలమయం. అడుగడుగునా అనూహ్యమయిన పరిణా మాలు. ప్రతి రోజా అయోచిత మయిన మలుపులు. ఇన్ని ఒడుదుడుకు లున్నా, ఇన్ని అవరోధాలు, అడ్డ గోడలున్నా, ఇన్ని సమసమ్యలున్నా మనిషి మనుగడలో ఎన్ని సుఖాలు, ఎన్ని సౌకర్యాలు, ఎన్ని సాధనాలు, ఎన్నెన్ని అవకాశాలు!! ఇదంతా ఎలా సమకూరుతోంది? సాధ్యమవుతోంది? మనిషేమన్నా స్వయంగా చేసుకోగల శక్తిమంతుడా? ఆ విశ్వ ప్రభువు ప్రశ్ని స్తున్నాడు:

**"సరే మీరు నాటే వస్తువు (విత్తనాన్ని) గురించి ఎప్పుడయినా ఆలో చించారా? ఏమి, దాన్ని మీరు పండిస్తున్నారా? లేక దానిని పండించేది మేమా? మేము గనక తలచుకుంటే దానిని పొట్టు పొట్టుగా చేసేయ గలము".** (అల్ వాఖిఅహ్:63-65)

**"పోనీ, మీరు త్రాగే మంచినీరు గురించి ఎన్నడయినా ఆలోచించారా? దాన్ని మేఘాల నుంచి మీరు కురిపిస్తున్నారా? లేక దానిని కురిపించేది మేమా? మేము గనక తలచుకుంటే దానిని చేదు నీరుగా మార్చేయ గలం".** (68-70)

**"పోని, మీరు రాజేసే నిప్పును గురించి ఎప్పుడయినా ఆలోచించారా? దాని వృక్షాన్ని మీరు ఉత్పత్తి చేశారా? లేక దానిని ఉత్పన్నం చేసినది మేమా?"** (71, 72)



మానవుల మనుగడకు ఏ వస్తువు ఎంతగా అవసరమవుతుందో అంతే లభిస్తుంది ప్రంచంలో. గాలి, నీరు పుష్కలంగా కావాలి, అవి లేని చోటు లేదు. ఆహారం బతుకుకు అత్యవసరం. అది సమృద్ధిగా లభిస్తుంది. శ్రామి కులు, కర్షకులు, కార్మికులు ఎందరో కావలసి ఉంటే, సాంకేతిక నిపుణులు, ఇంజినీర్లు, డాక్టర్లు, టీచర్లు అంతమంది అవసరం ఉండదు. అలాగే ఆయా రంగాల్లో ఆవిష్కరణలు, అసాధారణ ప్రజ్ఞావంతులు శతాబ్ది కొరకు ఆవిర్భ విస్తారు. ఈ వైవిధ్యం, ఈ ఆవశ్యకతా ప్రధానమయిన శక్తి సామర్థ్యాల పంపిణి, ఈ అవసరాలకనుగుణమైన ఏర్పాట్లు ఇలానే ఏ కర్త లేకుండా యాదృచ్ఛికంగానే జరిగిపోతున్నాయా?

ప్రాపంచిక భోగభాగ్యాల మాదిరిగానే ఈ శక్తి సామర్థ్యాల, బుద్ధి వివేకాల సౌభాగ్యమూ విశ్వకర్త విశ్వ వ్యవస్థ బ్రహ్మాండ పథకంలో భాగంగా మానవులకు సంప్రాప్తమవుతూ ఉంటుంది. కాబట్టి విశ్వానికి ఒక కర్త ఉన్నాడు అన్న యదార్థాన్ని గ్రహించి ఆ విశ్వ ప్రభువు చేసే ఏర్పాట్ల రీత్యా లభించే ఈ వర ప్రసాదాలను సౌజన్యంతో, సౌమనస్యంతో స్వీకరించి తృప్తి చెంది దానికి తగ్గట్టు కృతజ్ఞతా భావంతో విధేయత నిండిన జీవితం జీవించడంలోనే మానవుని గొప్పదనం దాగుంది. విశ్వకర్త మనం కొలిస్తేనే దైవం అవుతాడు, మానుకుంటే కాదు అన్న ఆలోచనకు మించిన ఆత్మ వంచన మరొకటి లేదు. మరి ఆయన ఇచ్చింది తింటూ, ఆయన ఇచ్చింది తొడుగుతూ, ఆయన ఇచ్చిన గాలిన పీల్చుతూ, ఆయన నేలపైనే జీవిస్తూ ఆయనకే అవిధేయత చూపడం ఎంత దుర్మార్గం! మరెంతటి ద్రోహం!!



చాలు, చాలు, అధిక ప్రసంగం ఆపు, దేవుణ్ణి తిరస్కరించడం నా దినచర్య. దైవ తిరస్కారంతో నా రచన,కవన పయనం సాఫీగా సాగుతున్నది. అయినా నాకేమీ కాలేదు....హాయిగా, దర్జాగా మీసం మేలేసి బతుకుతున్నా. మీరు చెప్పిన శిక్షా కాన రాదు. ప్రళయ భయంకర శబ్దమూ వినబడదు. ఇక ఆ నరకం వాసనం ◌ారా, అది అంతకన్నా గోచరించదు' అని అట్టహాసం చేస్తారా? వెకిలి నవ్వులు నవ్వుతారా? నవ్వండి, మిమ్మల్ని నవ్విస్తున్న ఆ నిజ ప్రభువే రేపు కన్నీళ్ళు కూడా పెట్టిస్తాడు. ప్రచండ శక్తిమాన్యుడయిన అల్లాహ్ ఇలా అంటు న్నాడు:

**"మనిషికి మేము ఉపహారమిచ్చి సత్కరిస్తే, అతనేమో ముఖం త్రిప్పుకుని తలబిరుసుగా వ్యవహరిస్తున్నాడు"** (ఫుస్సిలత్: 51)

**"వాస్తవమేమిటంటే, కడకు అందరూ పోయి చేరవలసింది నీ ప్రభువు వద్దకే. నిశ్చయంగా (మనిషిని) నవ్విస్తున్నది ఆయనే. నిశ్చయంగా ఆయనే ఏడిపిస్తున్నాడు. మరియు ఆయనే చంపుతున్నాడు. మరియు ఆయనే బ్రతికిస్తున్నాడు".** (అన్నజ్మ్: 42-44)

హేతువు సత్యానికి సేతువు

వీరు సృష్టికర్త లేకుండానే తమంతటతాము తయారయి ఉనికిలోకి వచ్చారా? లేక తమకుతామే సృష్టికర్తలా? పోనీ, భూమ్యాకాశాల్ని సృష్టించారా వీరు? (తూర్ - 35, 36)

أَمْ خُلِقُوا مِنْ غَيْرِ شَيْءٍ أَمْ هُمُ الْخَالِقُونَ



## నీ పుట్టుక అల్పమయిన బిందువు కాదా?

ఒక బిందువు. అందులో **కంటి**కి నేరుగా కానరాని కణాలు. వాటిలో నుంచి ఎన్నికయిన ఒక కణం. గోరంతది పండి, పిసరంతయి, రక్తపు ముద్దలో తడిసి, మాంసపు ముద్దగా తయారయి, ఎముకల గూడు కట్టుకుని, కండరాలు తొడుక్కుని వేలెడంతది పెరిగి, జానెడంతయి, మూరెడంతయి, మారు పలకలని స్థితి నుండి మారాము చేసేంతగా ఎదిగేలా చేసిన రూపకర్త పైనే ఇప్పుడు కన్నెర్రజేస్తున్నది. సృష్టికర్త లేడు అని వాదిస్తున్నది. తన వాదనకు, దృక్పథానికి అసంఖ్యాకమయిన ఆధారాలు వెదికి పెడుతున్నది. వాటిని తనూ నమ్మడానికి ప్రయత్నిస్తూ, ఇతరుల్ని నమ్మించడానికి ప్రయత్నిస్తున్నది. అంటే ఏక సమయంలో స్వీయ వంచనకు, పర వంచనకు ఒడి గడుతున్నది. 'నేను చచ్చి మట్టయ్యాక నన్ను బతికించేది ఎవర్రా?' అని సవాలు విసురుతున్నది. **"మరి ఉన్నట్టుండి మానవుడు బహిరంగంగానే – తగువులమారిగా తయారయ్యాడు. వాడు మమ్మల్ని ఇతరులతో పోల్చాడు. కాని తన అసలు పుట్టుకనే మరచి పోయాడు. 'కుళ్ళి కృశించిపోయిన ఎముకలను ఎవడు బతికిస్తాడు' అని వాడు సవాలు చేస్తున్నాడు".** (యాసీన్: 77-78)

సరే, సత్యం యదార్థ రూపం ధరించి అతని ఎదుట సాక్షాత్కరించిన నాడు అతని ఎత్తులు, జిత్తులు, వాదనలు, తర్కాలు అన్నీ కట్టపెట్ట వలసి ఉం టుంది: **"చెప్పెయ్యి: "వాటిని తొలిసారి సృష్టించిన వాడే (మలిసారి కూడా) బ్రతికిస్తాడు. ఆయన అన్ని రకాల సృష్టి ప్రక్రియల గురించి కుణ్ణంగా తెలిసిన వాడు".** (యాసీన్: 77-79)

ఆ దుస్థితి రాక పూర్వమే, తాను శవమయి కాటి మట్టిలో కలవక పూర్వమే బాగా ఆలోచించి, తన పుట్టూ పూర్వోత్తరాలను గురించి యోచిస్తే, తన ఉనికి పట్టుకి మూలమేదో తలపోస్తే మనిషి వాస్తవాన్ని గ్రహించగలడు. కాంతికి కళ్ళు తెరవ గలడు.



## ఆస్తికుల వాంఛ విధించిన ఆంక్ష

ఏ ప్రాణికి లేని బుద్ధి వివేకాలున్నాయి మనిషికి. సృష్టిరాశిపై ఒకింత అదుపు, ప్రకృతి శక్తులపై ఒకింత ఆధిపత్యం అతనికుంది. అయితే తనకు ప్రాప్తమయి ఉన్న ఈ వరాల దుర్వినియోగం వల్ల దుష్ఫలితాన్ని చవి చూస్తు న్నాడు. అందమైన ఆకృతిని ఇచ్చి, తన దేహంలోని ప్రతి అంగాన్ని, ప్రతి అవయవాన్ని వాడుకునే అధికారాన్ని ఇచ్చి, తనకు మేలయినదేదో తెలుసుకునే విజ్ఞతా జ్ఞానాన్ని, వివేచననూ అనుగ్రహించిన ఆదిమధ్యాంత రహితుడయిన అల్లాహ్, మనిషి స్వయంగా గ్రహించలేని, తెలుసుకోలేని సత్యాలు తెలుపడానికి, ఆతనిపై ఆనేక కారణాల వల్ల వచ్చి పడ్డ ఆంక్షల సంకెళ్ళను త్రెంచడానికి, అతన్ని ఇహపరాల తిరుగు లేని విజేతగా నిలబెట్టడానికి తన సందేశహరుల్ని, బోధకుల్ని సయితం నియమించాడు. అయినా మనిషి మాట తప్పాడు. సంపూర్ణ సత్యంతో జీవితాన్ని శోభాయమానంగా చేసుకో వాల్సింది పోయి,అర్ధ సత్యాల పంచన చేరాడు. పంచ భూతాలను దైవత్వంలో భాగం కల్పించాడు. జీవితంలో అడుగు తీసి అడుగు వెయ్యాలంటే అలవికాని భార మయిన ఆంక్షల సంకెళ్ళను కాళ్ళకు వేసుకున్నాడు. తల పైకెత్తి తిరగాలంటే వీలు పడని గుదిబండలు మెడకు వ్రేలాడదీసుకున్నాడు. వ్యక్తులు, జాతి, ప్రాంతం, భాష పట్ల శృతి మించిన అభిమానం...... దురభిమానం అపశృతులు పలికించింది. మూఢ నమ్మకాల ఊబిలో కూరుకుపోయి, శునక శాస్త్రాలు, మార్జాల శాస్త్రాలు సృష్టించుకుని, పునాదుల్లేని పేకమేడలు కట్టుకుని జీవించడం అలవాటు చేసుకున్నాడు. వాటన్నింకి ఆధ్యాత్మికత అన్న అందమయిన ముసుగు తొడిగిం చాడు. మనిషిని నిజ దేవుని దాస్యం నుండి తప్పించి దరి దరిన తల వంచే దిక్కు మాలిన స్థితికి చేర్చాడు.



## మనోవాంఛే తన దైవం

అతని దృష్టిలో అభిమానించే ప్రతి వ్యక్తి దైవమే- తల్లయినా, తండ్రయినా, గురువయినా, అతిథయినా, భర్తయినా, చివరికి సినిమా నటుడయినా. అతనికి ఉపయోగ పడే ప్రతిది దైవమే-భాషయినా, చదువయినా, పనయినా, జన్మ భూమయినా, వానయినా, వేడిమయినా, సూర్యుడయినా, చంద్రుడయినా, పామయినా, పశువయినా, చెట్టయినా, చేమయినా. లాభాన్నిచ్చే ప్రతిది దైవమే – ప్రేక్షకులయినా, పాఠకులయినా, ఓటరులయినా, నాయకులయినా, రాజులయినా,ప్రజలయినా. తన దృష్టిలో ఒక వ్యక్తి యెడల మరో వ్యక్తి గల అభిమానం చాలు అతడు దేవుడు అనడానికి. కలిగే లాభం చాలు దేవుడనడానికి. జరిగే వ్యాపారం చాలు దేవుడనానికి. ఎలాంటి శాస్త్రీయ ప్రమాణాలు అవసరం లేదు. వాటి వాసన కూడా తనకి పట్టదు. పెంపుడు కుక్కా దైవమే, పెంచిన మొక్కా దైవమే. అతని వాంఛే అతని దైవం. కనుకనే 'దేవుడు మంచి రసికుడు' అనేంతటి స్థాయికి దిగజారాడు మనిషి. సృష్టికి కర్త అనే వాడు ఒక్కడే అయినప్పుడు, ఇదే విషయాన్ని ప్రపంచ మత గ్రంథాలన్ని ఎలుగెత్తి చాటుతున్నప్పుడు ఇంత మంది దేముళ్ళు ఎలా పుట్టుకొచ్చారు అంటే, అదే మనిషి అజ్ఞానం, వాంఛ వల్ల వచ్చాయి అన్నది సూటి సమాధానం. చూడండి ఆ నిజ ప్రభువు ఏమంటున్నాడో:

**"తన మనోవాంఛను ఆరాధ్య దైవంగా చేసుకున్న వాడ్ని నువ్వు చూశావా?".**

(అల్ జాసియహ్: 23)

**"నిజానికి ఇవన్నీ మీరూ, మీ తాతముత్తాతలు వాటికి పెట్టుకున్న పేర్లు మాత్రమే. వాటిని గురించి అల్లాహ్ ఏ ప్రమాణమూ పంపలేదు. వీళ్ళు కేవలం అంచనాలను, తన మనోవాంఛలను అనుసరిస్తున్నారు".** (ఖుర్ఆన్- 23:23)

**"మీరు అల్లాహ్‌ను వదలి ఎవరెవరిని మొర పెట్టుకుంటున్నారో వారంతా మీలాంటి దాసులే".**

(ఆరాఫ్: 194)



"కరుణామయునికి సంతానం ఉందని వారు (బహు దైవారాధకులు) చెబుతు న్నారు. (వారు కల్పిస్తున్న ఊహాగానాలకు) అల్లాహ్ అతీతుడు, పరమ పవి త్రుడు. వాస్తవంగా వారంతా గౌరవించ బడిన ఆయన దాసులు". (అన్బియా: 26)

"కరుణామయుడయిన అల్లాహ్‌కు సంతానం ఉంది అని వారంటున్నారు. నిజానికి మీరు చాలా దారుణమయిన విషయాన్ని తెచ్చారు. కరుణామయు డయిన అల్లాహ్‌కు సంతానం ఉంది అని వారు చేసే పిడివాదం కారణంగా ఆకాశాలు పగిలిపోయినా (బ్రహ్మాండం బ్రద్ధలయినా), భూమి చీలిపోయినా, పర్వతాలు తుత్తునియలై పోయినా అవ్వచ్చు".

(మర్యమ్: 88-91)

"వాస్తవంగా సంతానం కలిగి ఉండటం అనేది కరుణామయిడయిన అల్లాహ్ (ఔన్నత్యాని)కి ఏ మాత్రం శోభించదు. ఆకాశాలలో, భూమిలో ఉన్న వారందరూ కరుణామయుడయిన అల్లాహ్ వద్దకు దాసులుగా రావలసిన వారే". (మర్యమ్: 92,93)



# నిజ దైవానికి నిరుపమాన అయిదు నిర్వచనాలు

## మొదటి నిర్వచనం:

**"ఓ మానవులారా! మిమ్మల్నీ, మీకు పూర్వం ప్రజల్నీ పుట్టించిన మీ ప్రభువునే ఆరాధించండి. తద్వారానే మీరు కాపాడ బడవచ్చు, భయభక్తుల వైఖరి అవలంబించవచ్చు".**

(ఖుర్ఆన్-2:21)

## గ్రహించాల్సినవి:

1) కేవలం మనందరి సృష్టికర్త మాత్రమే ఆరాధనకు అర్హుడు.

2) మనల్ని, మన ముందు తరాలను, తర్వాతి తరాలను పుట్టించినవాడు ఒక్కడే.

3) ఆయన పుట్టించేవాడేగానీ, పుట్టిన వాడు కాదు. పుట్టినదేది దైవం కాదు.

4) మనకు ముందు, తర్వాతి తరాలున్నట్లు ఆయనకు పూర్వీకులు ఎవ్వరూ లేరు.

5) ఆయన్ను ఆరాధించడం ద్వారానే మనిషికి ఇహపరాల ముక్తి మోక్షాలు ప్రాపిస్తాయి.

## విజ్ఞప్తి:

మొట్ట మొది మానవునికి నేడు ఆరాధించబడుతున్న వారి పేర్లయినా తెలిసే అవకాశం ఉందా? అతను ఎవరిని ఆరాధించి ఉంటాడు. మొదటి మానవుడు ఆదం (అ). ఆయన ఆరాధించింది తన నిజ ప్రభువయిన అల్లాహ్‌నే. అలాంటప్పుడు మనమూ ఆయన్నే కదా ఆరాధించాలి!



**రెండవ నిర్వచనం:**

**"ఇలా ప్రకటించు: ఆయన అల్లాహ్ ఒక్కడే. అల్లాహ్ నిరపేక్షాపరుడు. ఆయన ఎవరినీ కనలేదు. ఆయన కూడా ఎవరికీ పుట్టిన వాడు కాడు. ఆయనకు సాటి సమానమయిన వాడు ఎవడూ లేడు".** (ఖుర్ఆన్-112: 1-4)

**గ్రహించాల్సినవి:**

1) ఒక్కడే అంటే, ముక్కోటిలోని ఒక్కడు కాదు, ముగ్గురిలోని మూడవ వాడూ కాదు. ఎవడో ఒకడు కాదు. సర్వోన్నత నామాలు, సర్వోత్కృష్ట గుణాలు గలవాడు.

2) ఆయన నిరపేక్షాపరుడు. ఆయనకు భాగస్వామి అవసరం లేదు. ఎవరి మీదా ఆయన ఆధార పడడు. అందరూ ఆయన మీద ఆధార పడినవారే. ఆయన్ను ఒకరు కొలిస్తేనే దైవం కాదు, మానవ జాతి మొత్తం కలిసి ఆయన్ను కొలవడం మానేసినా ఆయన ఆరాధ్యుడే. మానవ జాతి మొత్తం కలిసి ఆయన్ను స్తుతించినా ఆయన ఆరాధ్యుడే. కొలవడం, కొలవక పోవడం వల్ల లాభ నష్టాలు మనిషికేగానీ, ఆయనకు కాదు. అదే మనిషి చేసుకున్న దేవుళ్ళను కొలవడం మానేస్తే అవి అంతరించి పోతాయి. దీనికి సుదీర్ఘ మానవ చరిత్రే సాక్షి. ఒకప్పుడు కొలవబడేవి ఇప్పుడు కొలవబడటం లేదు. ఒక ప్రాంతంలో కొలవబడేవి మరో ప్రాంతంలో కొలవబడటం లేదు.



**3) ఆయన ఎవరినీ కన లేదు.**

**"ఆకాశాలను, భూమినీ ఆవిష్కరించిన వాడు ఆయనే. అల్లాహ్‌కు భార్యే లేనప్పుడు ఆయనకు సంతానం ఎలా కలుగు తుంది?".** (ఖుర్ఆన్-6:101)

ఆయన అజన్యం, అజరం, అనిద్రం, అపారం. **"అరల్లాహ్ ఎవరినీ కొడుకుగా చేసుకో లేదు. ఆయనతోపాటు ఇంకొక ఆరాధ్య దేవుడు కూడా (భాగస్వామి) లేడు. ఒకవేళ అలాంటిదేదైనా ఉంటే ప్రతి దేవుడు తన సృష్టిని తీసుకుని వేరయి పోయేవాడు. ఒకడు ఇంకొకనిపై దండయాత్ర చేసేవాడు".** (ఖుర్ఆన్-23: 91)

**4) ఆయన ఎవ్వరికీ పుట్టిన వాడు కాదు. ఆయనకు తల్లిదండ్రులు లేరు.**

అనాదం, అనంతం, అపూర్వం. తల్లిదండ్రి లేకుండా పుట్టిన ఆదం దైవం కాదు. ఎందుకంటే తను అల్లాహ్ ద్వారా పుట్టించ బడ్డాడు గనక, తనకు పుట్టిన వారూ ఉన్నారు గనక. గర్భం దాల్చే స్త్రీ లేకుండా ఆదం ప్రక్కటెముకతో పుట్టిన ఆది నారీమణి హవ్వా దైవం కాదు. తండ్రి లేకుండా పుట్టిన ఈసా (ఏసు) దైవం కాదు, ఇక్కడ వింత పుట్టుక పుట్టిన వీరిది కాదు మహిమ, వారిని పుట్టించిన వానిది అసలు మహిమ.

**5) ఆయన్ను పోలినదిగానీ, ఆయనకు సరిసమానమయినదిగానీ ఏది లేదు.**

పోలిక ఉంది అంటే దైవం కాదు, సరి సమానమయిది ఉంది అంటే దైవం కాదు. **"ఒకవేళ భూమ్యాకాశాలలో అల్లాహ్ కాక ఇతర దేవుళ్ళు కూడా ఉండి ఉంటే ఈ రెండింలోనూ ఆరాచకం ఏర్పడేది".** (ఖుర్ఆన్-21:22)

ఒక్క మాటలో చెప్పాలంటే, అల్లాహ్ నిరపేక్షాపరుడు కాకపోతే ఒక్కడు కాలేడు. ఆయనకు అవతార అవసరం ఉంటే ఆయన నిరపేక్షాపరుడు, ఒక్కడుగా ఉండజాలడు. ఆయనకు భార్య, పిల్లలుంటే ఆయన నిరపేక్షా పరుడు, ఒక్కడు కాలేడు. ఆయనకు తల్లిదండ్రులుంటే ఆయన ఒక్కడు, నిరపేక్షాపరుడు కాలేడు. ఆయనకు పోలిక, సమానం ఉంటే ఆయన ఒక్కడు, నిరపేక్షాపరుడు కాలేడు.



**మూడవ నిర్వచనం:**

**"ఆ అల్లాహ్‌యే మిమ్మల్ని సృష్టించాడు. తర్వాత మీకు ఉపాధిని సమకూర్చాడు. మరి ఆయనే మిమ్మల్ని చంపుతాడు. ఆ తర్వాత మిమ్మల్ని బ్రతికిస్తాడు. చెప్పండి! ఈ పనులలో దేన్నయినా చేయ గలవాడు......మీరు కల్పించే భాగస్వాములలో ఎవడయినా ఉన్నాడా? వారు కల్పించే భాగస్వామ్యాల నుండి అల్లాహ్ ఎంతో పవిత్రుడు, ఉన్నతుడు".** (ఖుర్‌ఆన్ -30: 40)

**గ్రహించాల్సినవి:**

**1) ఆయన సృష్టించేవాడేగాని, సృష్టించ బడినవాడు కాదు.**

**"ఇదీ అల్లాహ్ సృష్టి! ఆయన మినహా వేరితరులు ఏం సృష్టించారో మీరు నాకు చూపించండి".** (లుఖ్మాన్: 11)

'మానవుడు కూడా ఎన్నో వస్తువులను తయారు చేస్తున్నాడుగా' అని కొందరు అనొచ్చు. అల్లాహ్ ఏమి లేని శూన్య స్థితి నుండి పుట్టించేవాడ యితే, మనిషి అల్లాహ్ సృష్టించినవాటిలో నుంచి తీసుకుని, ఆయన తనకిచ్చి తెలివిని, శక్తిని, సామర్థ్యాన్ని వినియోగించి ఒక వస్తువును తయారు చేస్తాడు. కనుక తయారు చేసినవాడు, తయారయిన వస్తువు రెండూ అల్లాహ్ సృష్టే. **"మరలాంటప్పుడు సర్వాన్ని సృష్టించేవాడూ, ఏమీ సృష్టించలేని వాడూ ఇద్దరూ ఒక్కటేనా? మీరు బుద్ధి పెట్టి ఆలోచించరా?"** (ఖుర్‌ఆన్-16:17)

**2) ఆయన మీకు జీవనోపాధిని సమకూర్చాడు.**

అంటే ఆయన పోషించే వాడేగాని, ఒకరి పోషణ అవసరం ఉన్నవాడు కాదు. మనిషి పెట్టే నైవేద్యాల అవసరంగానీ, మనిషి కట్టే గుళ్ళు గోపురాల అక్కరగానీ అయనకు లేదు. అన్నింటికి  ఆశ్రయం అయిన ఆయనకు ఆశ్రయ అవసరం లేదు. అందరికీ అన్నం పెట్టే ఆయనకు నైవేద్య అవసరం లేదు. అందరికీ బట్టననుగ్రహించే ఆయన బట్ట కట్టాల్సిన, కప్పాల్సిన అవసరం లేదు. అందరికీ రక్షణ ఇచ్చే ఆయనకు సీసీ కెమరాల, సెక్యూరిటీ గార్డ్‌ల, బుల్లెట్ ప్రూఫ్ జాకెట్ల  అవసరం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచంలో నివసించే 7 వందల కోట్ల మందికి, మనిషి గ్రాహ్య పరిధిలోకి వచ్చిన అనన్య ప్రాణులకు, గ్రాహ్య పరిధిలోకి రాని అగణ్య ప్రాణులకు ప్రతి రోజూ, ఎక్కడ ఎవరికి ఎంత కావాలో అంత ఉపాధిని లక్షల సంవత్సరాలుగా ప్రసాదిస్తూ వస్తున్న వాడు అల్లాహ్. అలాంటి ఉపాధి ప్రదాత కన్నా మహోన్నతమయిన ఉపాధి ప్రదాత మరొకడు ఉన్నాడా?

**3) ఆయనే మనల్ని చంపుతాడు. మనందరి జీవన్మరణాలు ఆయన చేతిలోనే ఉన్నాయి.**

అంటే పుట్టి గిట్టే వాడు దేవుడు కాదు. **"ఎన్నటికీ మరణించని వాడూ, నిత్యుడూ అయిన అల్లాహ్‌నే నమ్ముకో".** (ఖుర్‌ఆన్-25:58)

**నాల్గవ నిర్వచనం:**

**"నిస్సందేహంగా ప్రళయానికి సంబంధించిన జ్ఞానం అల్లాహ్ వద్ద మాత్రమే ఉంది. ఆయనే వర్షాన్ని కురిపిస్తున్నాడు. మాతృ గర్భాలలో ఏముందో ఆయనకు తెలుసు. తాను రేపు ఏం చేయనున్నదో ఏ ప్రాణి ఎరుగదు మరియు తాను రేపు ఏ గడ్డపై మరణిస్తుందో కూడా ఎవరికీ తెలీదు. అల్లాహ్ సర్వజ్ఞాని, అన్నీ తెలిసినవాడు".** (ఖుర్ఆన్-31:34)

**అసలు జీవిత పరీక్ష:**

అంతటి జ్ఞాన, శక్తిమాన్యుడు అయిన అల్లాహ్ ఎందుకు కనబడడు? అని కొందరు ప్రశ్నించవచ్చు. **"ఎవరి చూపులు కూడా ఆయన్ను అందుకో జాలవు. ఆయన మాత్రం అందరి చూపులను అందుకో గలడు".** (ఖుర్ఆన్-6:103)

**"తమ ప్రభువును చూడకుండానే ఆయనకు భయ పడుతూ ఉండే వారి కోసం క్షమాపణ, గొప్ప పుణ్యఫలం ఉంది".** (ఖుర్ఆన్-67:12) దేవుణ్ణి చూడకుండా విశ్వసించడమే అసలు జీవిత పరీక్ష.



## అయిదవ నిర్వచనం:

"అల్లాహ్ ఆయన తప్ప నిజ ఆరాధ్యుడు ఎవరూ లేరు. సజీవుడు, ఆధార భూతుడు. ఆయనకు కునుకుగానీ, నిద్దురగానీ తాకదు. ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఆయనదే. ఆయన అనతి లేకుం డా ఆయన సమక్షంలో సిఫారసు చెయ్యగల వాడెవ్వడు? వారి ముందు ఉన్న దానినీ, వెనుక ఉన్న దానిని కూడా ఆయన ఎరుగు. ఆయన కోరినది తప్ప ఆయనకున్న జ్ఞానంలోని ఏ విషయమూ వారి గ్రాహ్య పరిధిలోకి రాదు. ఆయన కుర్చీ వైశాల్యం భూమ్యాకాశాలను చుట్టుముట్టి ఉంది. వాటిని రక్షించటానికి ఆయన ఎన్నడూ అలసిపోడు. ఆయన సర్వోన్నతుడు, గొప్ప వాడు". (ఖుర్ఆన్-255)

## చివరి మాట విశ్వ ప్రభువు నోట:

"ఆయనే అల్లాహ్. మీ ప్రభువు. ఆయన తప్ప మరో నిజ ఆరాధ్యుడెవడూ లేడు. సమస్త వస్తువులను సృష్టించిన వాడు ఆయనే. కాబట్టి మీరు ఆయన్నే ఆరాధించండి. అన్ని విషయాల కార్యసాధకుడు ఆయనే". (ఖుర్ఆన్-6:102)








## రచయిత ఒక చూపులో

పేరు సయ్యిద్ అబ్దుస్సలామ్. పుట్టింది తమిళనాడులోని అమ్మమ్మ ఊరైన వాలాజబాద్. పెరిగింది చిత్తూరు జిల్లాలోని కుగ్రామం నెరబైలు, పాత తురక పల్లి. ప్రాథమిక విద్య స్వగ్రామంలోని ప్రభుత్వ పాఠశాల. పై చదువులు దారుస్సలామ్ కాలేజీ (ఉమరాబాద్) ప్రస్తుతం ఉంటున్నది కువైట్ దేశంలో. రాసిన మొదటి వ్యాసం నమాజ ప్రాశస్త్యం - 2005 గీటురాయి మాస పత్రికలో. ప్రస్తుతం నెలవంక మాస పత్రిక ప్రధాన సంపాదకులు. ప్రచురితమైన పుస్తకాలు ముఖబందిత మధుకలశం, హజ్జ్ ఆదేశాలు. అనురాగ రావం. టెలికాస్ట్ అయినా ప్రోగ్రాములు KTV2, మెర్సీ మరియు స్ఫూర్తి చానల్స్ లో వివిధ అంశాల పై ధార్మిక ప్రసంగాలు.

**ప్రవృత్తి:** సత్యాన్వేషణ.